శ్రీరస్తు.

# బాటసారి.

అను నీ నిర్వచనాంధ్ర ప్రబంధము

బ్రహ్మశ్రీ - శ్రీమదజ్ఝాడాదిభట్ల

## నారాయణదాసుగారి

విరచితము.





మూడవకూర్పు ౧౦౦౦ ప్రతులు.





విజయనగరం

శ్రీవేదవ్యాస ముద్రాక్షరశాలలో

ముద్రితము.

1933.

 [Price 8 annas.

# PREFACE.

THE story embodied in this book is an allegory of human life which begins in sheer ignorance and ends in perfect knowledge. In writing this small poetical work my main object had been to present to the Telugu reading public an attempt at something original as to plot, coupled with vividness of natural descriptions told in easy Telugu devoid of all the artificialities of the usual ornate style. This system, I venture to hope, would be acceptable to cultured readers whose tastes have been mellowed by the ever-advancing modern Literature of the West.

I beg to dedicate this humble book to the Hon'ble Rai Bahadur P. ANANDA CHARLU, Vidya Vinoda, B.L , C.I.E., F.M.U., one of the best friends of Telugu Literature, as a small token of my ever-lasting gratitude to him.

VIZIANAGARAM,
*1st June 1933.*

A. NARAYANDAS,
*Principal,*
*Maharajah's Music College.*

# బాటసారికి గూఢార్థము.

బాటసారి మాయాగర్భనరకవిముక్తుఁడగుచుఁ బూర్వజన్మవాసనన్జింతింపఁదొడఁగిన యాత్మ్మఁడు, దారసుతులు విద్యావివేకములు, మహాోదధిసంసారము, ఓడపుణ్యము, ఓడన్బగిల్చిన కొండ పాపము, నూదికొండప్రకృతి, సరోనదీపక్షిణసీమలు జాగ్రత్స్వప్నసుషుప్తులు, ఏడంతరవు లేదురంగులిరువదెనిమిది గదులుగల యొంటికంబము మేడ సప్తధాతువులు సప్తోపాయములు, అరిషడ్వర్గములు, పంచకోశములు, నాల్గు పురుషార్థములు, త్రిగుణవికారములు, ప్రవృత్తినివృత్తులు, బ్రహ్మపదవి, కంబముపాధి. రాజదంపతులు జ్ఞానవైరాగ్యములు, చెలికత్తెలష్టాంగములు, తొలిరాజధానియైహికము రెండవరాజధాని యాముష్మికము, గంటకంబము కర్మము, వ్రాఁత శాస్త్రము, నూత్నవధూవరులు భక్తిశ్రద్ధలు, వలపుజాబుపనిషత్తు, బాటసారికి స్వదారసుత పునస్సమావేశము కైవల్యప్రాప్తి, గుఱ్ఱము బుద్ధి, బాఁకు తుపాకి బల్లెమీఁటెలు సాధనచతుష్టయసంపత్తులు, పులిపందులు రాగద్వేషములు, జాగిలములు వ్రతములు, ఆసవము దీక్ష, దాది సంప్రదాయము, గడియారమాయువు, ఉంగరము ప్రత్యభిజ్ఞానము, వానదేవతా ప్రసాదము, మామగురుఁడు, బావ సఖుఁడు. విభ్రాన్తుఁడై బద్ధుఁడగుచుఁ బ్రబుద్ధుడై ముక్తుఁడగుచుంట యాత్మ్మని సహజక్రీడలని బాటసారికథకంతకును వేదాన్తపరముగా నర్థమిట్లూహ్యము. ఈబాటసారి కథస్వకల్పితముగాని యింకొక భాషాకావ్యమున కనువాద మెంతమాత్రమున్గాదిందుఁదత్సమతద్భవము లచ్చతెలుఁగు వివరింప నలవికాని పదార్థ ప్రకటనమునకు మాత్రమే యించుమించుగాఁ గూర్చఁబడినవి. మొత్తము పైఁదత్సమతద్భవము లడ్డదిడ్డముగాఁదలుచు పద్యకావ్యములన్జొనిపి తీయని తేటతెలుఁగునాటుపల్కులన్జిల్కపచుర్వారుభయ భాషలపర్వ్యతీయు వర్ణసాజ్కర్యపరులు కవులింక మీఁదఁగాఁదగదు. ఈబాటసారిన్జేసి యాడుచుఁబాడుచు న్దెలుఁగు వారలకు నేవినిపింప మొదలిడినపుడు నాయీడిరువదినాలు గేండ్లు.

# ఒప్పులు.

| పెడ — బంతి | |
|---|---|
| ౧౫ | తెప్పిరిల్లి |
| ౫ | అదిగో |
| ౧౨ | బోరన |
| ౧౩ | క్రీడిలంబడు |
| ౧౧ | వ |
| ౫ | పీయక, దాఁక |
| ౬ | లోఁ |
| ౭ | బొదలుచు |
| ౧౧ | వేగుఁజుక్క |
| ౨౧ | డ |
| ౧౪ | అతఁడొక్క |
| ౨౦ | గుబ్బన |
| ౨౨ | గొన్ని |
| ౨౩ | బొఁదును |
| ౧౨ | మరలు |
| ౧౦ | వేలకు |
| ౧ | యూసోథ |
| ౧౬ | యేదో |
| ౩ | వాఁక |
| ౨౨ | వెడలు, పున |
| ౨౦ | గొలపునాకుల్ |
| ౨౪ | మ్రాఁకుల్ |
| ౨౧ | పడంతి |
| ౧౪ | చేమటి |
| ౨౨ | నచటి |

| | | |
|---|---|---|
| ౨౩ | ౧౫ | తట్టు |
| | ౨౪ | న్జేరి |
| ౨౫ | ౪ | ఆ |
| ౨౬ | ౨ | నిక్కంబు |
| ౨౮ | ౧౮ | కేలు |
| ౨౯ | ౨౨ | వద్దము |
| ౩౧ | ౪ | కనుల |
| ౩౭ | ౧ | టి |



మాటలల్లువాఁడు పాటకాఁడు

అజ్జాడాదిభట్ట నారాయణదాసుఁడు.

# బాటసారి.

ఉ॥ ఒక్కమహానుభావుఁడు మ । హోదధియానముచేసి ముప్పూన।
న్దక్కి తొలంగిపోవు నిజ । దారసుతార్థముకై సరోనదీ।
పక్కణసీమలన్వెదకి । వారలు సుస్థితినుంటగాంచి పెం।
పెక్కను బాటసారియయి । యిక్కథ పేర యశోవిహారియై॥ ౧.

ఉ॥ ఎచ్చటనుంటి నేనిచటి । కెట్టులవచ్చితిఁ గన్నతెంతయు।
న్విచ్చినఁ గానరాదిదియు । నిక్కమయేమిది పెద్దమ్రోఁతనా।
కచ్చెరువై వినంబడుఁ గ । టా తెలిసెన్నది దిట్టచేతుఁ జై।
వచ్చిన నీటితాఁకువడిఁ । బ్రాఁకుచు నెట్టన నొడ్డుచేరితిన్॥ ౨.

ఆ॥ చిన్నికొడుకుతోడఁ । జెలియయేమయ్యెనో।
కొండతగిలి యోడ । కొట్టఁబడిన।
తెన్నుతోఁచకుండెఁ । దెఱపినీదిటుమబ్బు।
గ్రమ్మురేయిమిగుల । గానరాదు॥ ౩.

ఆ॥ ఇట్లు బాటసారి । యెంతయుదిగులంది।
కడువివేకశాలి । గానఁగొంత।
తెప్పిఱిల్లి ప్రేమ । ద్రెంచలేక విరాళి।
జెందిముద్దరాలి । బొందుతలఁచి॥ ౪.

ఉ॥ పాపపు దైవమెంతపొర । పాటొనరించెను నన్నుమిగిల్చె న।
య్యోపికవాణియోవికసి । తోత్పలలోచన నిన్నుబాసి యె।
ట్లోపుదు జాముక్రింద మన । ముంటిమి ముచ్చటలాడుకొంచు నా।
హా పరిపూర్ణచంద్రవద । నా మనకింకఋణంబు చెల్లెనా॥ ౫.

ఆ॥ అనుచు సొమ్మసిల్లి । యతఁడెట్టకేలకు।
దిమ్మదీఱ డెంద । ముమ్మలింప।

అలసినట్టి యంగ | ములఁ గూర్చుకొని లేచి|
నిలిచి నాల్గుదెసలు | కలయఁజూచి|| ౬.

క|| కానీ దైవము యిక్కడ|
కొనను దెచ్చితివి యెట్టు | లో నీమీదఁ గ|
పూని సయిరింతు నదుగోఁ|
బైనెగడు తూర్పు | తెల్లవాఱుచునుండెన్|| ౭.

చ|| అనుచతఁడంతఁ గాంచెఁ జటు | లానిలసంచల దూర్మిమాలికా|
ఘనవికటధ్వని ప్రబల | కన్ధిసముత్ప్లవమాన రమ్యనూ|
తనరవిబింబ మొక్కదెసఁ | దక్కినచక్కులఁ బిక్కటిల్లియు|
న్కనదుమిన్నుదన్ను నొక | కొండనుదండను గాంచి వెండియున్|| ౮.

తే|| తొడరియక్కొండనడుమ నె | క్కడనొ తొల్పు|
కొనుచు వడిసైఁచలేక హో | రునఁబిఱుంది|
కిడ్డిలన్బడఁ గొండల | నీడ్చుకొనుచు|
నేపుమైఁ ద్రుళ్లిపడు సెల | యేఱుఁగనియె|| ౯.

గీ|| కాంచి యతఁడట్టి క్రొత్తలో | కంబునందు|
నున్నతీరున నచ్చెరు | వొందివేఱు|
వంకఁ బోలేక యెద్దియు | న్పాలుపోక|
తెంపుతోఁ దుదకాయేటి | తెన్నువట్టె|| ౧౦.

సీ|| ఆయేటి కిరుపంక | లం దేటవాలుగ |
మెట్లుమచిఱసయట్లు | మీఱి నెఱయఁ|
బండినమామిళ్లు | పనసలు నిమ్మలు |
నేరేళ్లు మఱివింత | తీరుచెట్లు|
లెడనెడ గెలలతో | నింపార వంగిన |
కపురంపుటనఁటులు | కమ్మతావి|
వెదచల్లు గొజ్జంగి | పొదరిండ్లునందందఁ |
జిన్నిపూఁదేనియ | ల్చిల్కుచోట్లు|

కన్నులకువింతపండువు । గాఁగనతఁడు।
చూచుచీశ్వరసృష్టికిఁ । జోద్యపడుచు।
కొండసగమెక్కి నెమ్మది । గొనఁదలంచి।
కూరుచుండెను సంపంగి । గున్నక్రింద॥ ౧౧.

సీ॥ నెమరువేయుచు లేళ్లు । నీడల నాగెలోఁ ।
బొదలలో నెమళులు । కుదురుకొనియె।
లోఁతుమడుంగుల । నీఁతాడె నేన్గులు ।
పందులు బురదలఁ । బొదుకొనియె।
కొమ్మలపైఁ జేరుకొనియెఁ । గోఁతులుపుల్గు ।
లన్నియుఁదొఱ్ఱల । నణఁగఁజొచ్చె।
లోవలఁబడిపులు । లావులింతలుదీసె ।
నొండులలోఁ బాము । లూపుఁజాలుచ్చె।
అడవిసందడితగ్గ న । ల్కడలయందుఁ।
జెలఁగి పొగచిమ్ముకొంచు కా । చిచ్చుహెచ్చె।
రెండుజాముల వేసవి । మండిపడుచుఁ।
గొండబీఁటలు వాఱఁగ । నెండకాఁచె॥ ౧౨.

క॥ ఆయెండ తాఁకు వడియుఁ।
హాయిగఁ జలినీరుచల్లు । నాయేటిదరిఁ।
రేయివడుదాఁక నిద్దుర।
వోయి యతఁడుమేలుకాంచెఁ । బోలుపుగనంతన్॥ ౧౩.

గీ॥ కడలినవ్వుచుఁ బొంగి సం । దడు లొనచెఁ।
గప్పురపు దివ్వెవలెఁజంద్రు । డొప్పమీఱె।
కొండయంతయు మెండుగ । వెండివాఱఁ।
బండువెన్నెల కన్నుల । పండువయ్యె॥ ౧౪.

ఉ॥ అంత నతండు కన్నులకు । హాయిగవెన్నెల గాయఁగాంచి తా।
నెంతయు సంతసించి పర । మేశునిపైఁ దనభారముంచి ని।

శ్చింతఁ జనంగనెంచి నలు చెంగటలన్బరికించి దారి యొ।
క్కింతయుఁదప్పిపోకసెల యేటిదరిన్బడియేగుచుండఁగన్॥ ౧౫.

గీ॥ పులుఁగు మూల్గులు బెబ్బులి బొబ్బరింత।
లడవినందంద నెమ్మది కడలుగొల్ప।
తడఁబడుచతండు నడిరేయి దాఁక నడచి।
దారికడ్డుగ నొకకొండ తగులఁజూచి॥ ౧౬.

చ॥ ఇదియొక సూదికొండ తెఱ వీయఁక యీసెలయేఱు దీనిలో।
పు దొలిచివచ్చుచున్నయది పోవఁగ నాకిటమీఁద దారియె।
య్యది చటఁ బ్రొద్దుదూఱువఱ కాఁగెదనంచొకచాపఱాయి వె।
న్నదియఁగ మోపి మింటిదెస గన్గొనుచున్దలపోసె నిట్టులన్॥ ౧౭.

గీ॥ వెల్లబాఱిన జాబిల్లి వేగుఁజుక్క।
యును దివంబున వెలయుచు నున్నయట్లు।
చిన్నికొమరునితో ముద్దు చెలియ తేలు।
చుండెఁగాఁబోలు మున్నీట నిండుదొఱఁగి॥ ౧౮.

ఉ॥ ఎక్కడి నావయాత్ర లభి యించె నహా మనపాలదిక్కులే।
కక్కట నిన్నుబాసి చెలి యీయిటులొంటిగనుంట వ్రాసెనే।
మ్రుక్కడి దయ్యమింతపని పుట్టునఁటంచు నెఱుంగనైతినే।
చక్కని నిన్నువంటి సతి జన్మశతంబులనైనఁ గల్గునే॥ ౧౯.

క॥ అనిబిట్టు సొమ్మసిలి నె।
ట్టనఁ దెల్విన్బొంది యంత టజ్జెగుఱు పూ।
సినలాగు ప్రొద్దుపొడుమఁగఁ।
గనుఁగవనీరొత్తుకొంచుఁ గనుఁ గొనిపెలుచన్॥ ౨౦.

గీ॥ ఔర గారడిసూర్యుండ యబ్బరంబు।
కద బ్రతుకువన్నెనీకర కౌశలంబు।

అల్పభోగంబులన్జూపి । యధికదివ్య।
ములను గన్పట్టనీయక । మోసపుచ్చు॥ ౨౧.

క॥ అనియిట్లు బ్రతుకుపై రోఁ।
తను బట్టి యసూయవుట్టఁ । దనకక్షుల ని।
చ్చిన లోకబాంధవుండన।
కనిష్ఠురములాడి యతఁడు । గమనోన్ముఖుఁడై॥ ౨౨.

క॥ పరికించి కొండయావల।
కరిగెడు నొకలోయదారి । నారసియందున్।
జొరఁబడుచు నట్టకేలకుఁ।
జెరువొక్కటిగాంచి దాని । చెలువున్బొగడెన్॥ ౨౩.

సీ॥ చుట్టునగట్టులు । పెట్టినయట్టులు ।
బలు కొండల నెవండు । నిలిపినాఁడు।
నీటిమట్టముదాఁక । నాటినట్టుల ।
వృక్షపంక్తులెవండు । పెంచినాఁడు।
కనుచూపు దూరంబు । గాఁ జదరముగ నెం ।
తయు లోఁతుగ నెవండు । త్రవ్వినాఁడు।
పలువన్నియల తామ । రలు కలువలునర్సఁ ।
బూలనారెవ్వఁడు । పోసినాఁడు।
సృష్టివైచిత్ర్య మహహాయూ । హింపఁ దరమ।
యేమనుష్యులచేఁత కీ । యింపువచ్చు।
నేనుచూచిన నెలయేఱు । దీనిలోనఁ।
దొడరికాఁబోలు నిక్కొండఁ । దొలిచిపడియె॥ ౨౪.

క॥ ఇటులబ్బురపడి యతఁడా।
తటాకమునఁ స్నానమాడి । తపనున్గని దూ।
ఱుటకై పొక్కుచునంజలి।
పుటమున్మతో నీరుపట్టి । పొగడన్జొచ్చెన్॥ ౨౫.

గీ॥ అడలుఁగొలిపెడు చీఁకటి । కడలినుండి।
కడపిమముఁగాచు తరణికిని । కిడెద మ్రొక్కు।
అహితములఁ గొట్టి గొప్పమే । ల్లాచరించి।
యేలుచుండెడు మిత్రునీ । కిదె జోహారు॥ ౨౬.

క॥ అనుచనర్ఘ్యమొసఁగి యొడ్డునఁ।
దినఁదగు దుంపలొకకొన్ని । తీసి సమలి తీ।
యని నీరుద్రాగి బలుకా।
న్ననీడకున్నడఁగి యతఁడు । కూర్చున్నతఱిఁ॥ ౨౭.

చ॥ గిరులదరంగ నొక్కమొగి । గీఁకరొదల్చెలరేఁగె నంతట।
న్ధరణివడంకునట్టులఁ బ । దంబుల చప్పుడుతోఁచెఁ బిమ్మటన్।
గరములఁబట్టి చెట్టులు పె । కల్చుచు వీనులవీచుకొంచు న।
త్వరముగగొండలీనిన వి । ధంబున నేన్గులు చెర్వుచేరఁగన్॥ ౨౮.

గీ॥ తమ్మిమాలిన ధర్మంబు । తగదటంచుఁ।
జలల నలరించు తమ మొద । ళులను గావఁ।
బూనిచాఁచిన నీడల । ముడుఁచుకొనిమెఁ।
బాదపంబులు నడిమింట । భానుఁడొప్ప॥ ౨౯.

క॥ అబ్బరము వెలపుబెనఁగొన।
గొబ్బున నతఁడొకమఱ్ఱి । కొనకెక్కను జె।
ర్వొబ్బఁగ నేనుఁగు కదుపులు।
గుబ్బున డిగి డప్పితీర్చు । కొని చెలువారన్॥ 30.

ఉ॥ కొమ్ములఁజొన్పియొడ్లుపడఁ । గ్రుమ్మనుగొన్ని జలమ్ముపీల్చిపైఁ।
జిమ్మును కొన్ని తామరలు । చెన్గలువల్పెకలించుఁ గొన్ని తొం।
డమ్ముల నీటిమీఁదను ద । టాలున మోదునుగొన్ని పట్టుపం।
తమ్ములనీఁదుఁగొన్ని మెయి । తాఁకులఁజొక్కునుగొన్ని యేనుఁగుల్॥

గీ॥ దన్తియూథమ్ములిట్టులఁ । దనివితీఱఁ।
జెరువులోపలఁ జెరలాడి । పరువులిడుచు।

మూరుకొను చెదరేగుచుఁ ‘ బోరు చునికి।
మూలలకుఁజేరెఁ బడమటఁ ‘ బ్రొద్దుజారె॥ ౩౨.

ఆ॥ అంతవఱకుఁ జెట్టు ‘ నందుండి దవ్వుల।
నాతఁడొక్కయున్న ‘ తాలయంబు।
డెందమలరఁగాంచి ‘ క్రిందికిదిగి మేటి।
పూవుఁదోటనుండి ‘ పోవుచుండి॥ 33.

సీ॥ ఏవైపుజూచిన ‘ నావైపుననె కమ్మ ‘
తావులీనెడు వింత ‘ పూవుఁబొదలు।
నేవంకఁగనుఁగొన్న ‘ నావంకనేఫలి ‘
యించు నానావిధ ‘ వృక్షపఙ్క్తి।
లేదిక్కుఁబరికింప ‘ నాదిక్కునని సన్త ‘
తము నీరుచల్లు య ‘ న్త్రములు మఱియు।
నేతట్టుఁగాంచిన ‘ నాతట్టుననె తీర్చి ‘
కట్టినమణిమయ ‘ కుట్టిమమ్ము।
లద్భుతానందములు పెన ‘ యన్న నతఁడు।
గనుచుఁ గలయందు విహరించు ‘ కరణిఁజనుచు।
ఒంటిపాటునకై వగ ‘ పొంది యంత।
లోనఁ దనచెలిఁదలఁచి యి ‘ ట్లు పలవించె॥ 3౪.

సీ॥ పించి యంబుల విప్పి ‘ పెండ్లియాటల నొప్పి ‘
యాడునట్టువపిట్ట ‘ జోడుఁజూచి।
తనమిటారికిడంబు ‘ తలిరుటాకువిడెంబు ‘
వాడుకోయిలమిన్న ‘ దాడిఁజూచి।
పడఁతితోడుత నచ్చ ‘ పండుగు జురుముచ్చ ‘
టోడుచుఁ దినుచిల్క ‘ ప్రోడఁజూచి।
కమ్మతేనెల మెక్కి ‘ కొమ్మకౌఁగిటఁజొక్కి ‘
పాడులేదుమ్మెద ‘ కోడెఁజూచి।

అంత గంతులవెచ్చి ర ఽ వంత నొచ్చి।
నేర్పరియనుచు మెచ్చి ని ఽ ట్టూర్పుపుచ్చి।
బయలు కౌఁగిళులకుఁ జొచ్చి ఽ హొయలువిచ్చి।
నచ్చి పొగలుచునుంటిఁ జా ఽ న యిటువచ్చి॥ ౩౫

గీ॥ ఇన్నిసోద్దెములన్జూచి ఽ యేగుచుంటి।
మనసునకు నిచ్చ్వతగులదు ఽ మఱియదేమొ।
కానితలఁపున మెలఁగు ఽ చక్కనివెలంది।
బిడ్డలన్బాసి యుంటకీ ఽ యడ్డులేమొ॥ ౩౬

గీ॥ అనుచు వలవంతఁదూలుచు ఽ నతఁడు రేయి।
వడినవేళకు నాదివ్య ఽ భవనమునకు।
వచ్చియాలోనికిన్జొచ్చి ఽ యచ్చెరువుగ।
నచటి వింతలుగని యిట్టు ఽ లబ్రపడియె॥ ౩౭

సీ॥ కమలాకృతియుఁ జుట్టు ఽ కైవారమురకోసు ఽ
గలిగి యేడంతస్థ ఽ ములఁ జెలంగి।
మొదటిదా సంకణమున ఽ కేను రెండు నా ఽ
పయిదాని కాఱెట్లు ఽ వరుసతోడ।
నొక్కొకటియె తగ్గి ఽ యుండె గదులలెక్క ఽ
తనరు నంతరవు నం ఽ తరువుక్రింద।
నొక్కొక్క బలుకంబ ఽ మూఁతముగా నిలు ఽ
వున కొండువన్నియ ఽ పొల్పుమీఱు।
ధాన్యరాశులకుఁ దోలియుం ఽ తస్తు నీటి।
యంత్రముల కవ్వలిదియుమూఁ ఽ డవదిపంట।
కావలది యూరగింపుల ఽ కైదవయది।
సభకు నాపైదిశయ్యౌక ఽ చదనకుఁదుదది॥ ౩౮

శా॥ ఔరా యేమి మహాద్భుతంబిది నిజం ఽ బాచిత్తవిభ్రాన్తియా।
యేరీ యెవ్వరు గానరారిచట నూ ఽ హింపన్నశక్యంబు కా।

దే రాజ్యంబుననుంటినో యెవరిదో । యీవిసౌధరాజంబు నా।
నారత్నాంచితమైతమంబుడిపియా । నందంబుగావించెడిన్॥౩౯.

సీ॥ అన్నియంతస్తులందు న । నతుకులేక।
వెలయురతనాలు బలుకంబ । ములుగదూల।
ములుగగోడలుగాఁ దిన్ని । యలుగబళిర।
యిట్టి వింతలు మఱియునెం । దేనిఁగలవె॥ ౪౦.

క॥ ఎచ్చోటనుండి చూచిన।
నచ్చెరువుగ మేడయెల్ల । నగపడెడుఁగదా।
యచ్చపురతనంబగుటం।
బెచ్చుగ నిదియిట్లు మూఱు । మెఱయుచునుండెన్॥ ౪౧.

క॥ అవురా కిఞ్చిదోభ్భగో।
భవిష్యతియ నస్గనిచట । స్పష్టంబయ్యెన్।
దివిజేశ్వరునకయిన నీ।
భవనోన్నతిఁ బొందనెట్లు । ప్రాప్తంబౌనో॥ ౪౨.

మ॥ నరులాకారని మేషభావమిచట । న్గాన్పించుటన్వేల్పులా।
దురు నన్నెవ్వరుపల్కరించరిదియె । దో మాయకాఁబోలుఁబా।
పురెయిచ్చోఁ బనులెల్లఁజేయుటకుఁ గీ । ల్బొమ్మల్గడంగన్బొరిం!
బోరిఁగాలోచితరాగతాలములన । మ్మోదంబుకావించుచున్॥౪౩

సీ॥ అనుచుఁ దుదిమిద్దెపైనుండి । యాఁతఁడు మగ।
యాఁడుబొమ్మలవింతల । నరయుచుండ।
గొంతలోపల గంటకం । గుమని మ్రోఁగె।
వెంటనేమేడలో వింత । వెలుఁగుతోఁచె॥ ౪౪

సీ॥ చుట్టుచెలువలుగొలువఁగ సొంపుతోడఁ।
జెలఁగుతనముద్దుకోమలి । చెట్టఁబట్టి।
చుక్కలందున రోయిని । ప్రక్కనొప్పు।
చందురునివలె నొకపాదు । సాహింతోఁచె॥ ౪౫.

క॥ అద్దివ్యపురుషుఁడ త్తఱి।
సుద్విజ్ఞలకంబులాడి । జోటులుకొల్వన్ ।
ముద్దియచేతిగ్నాని తుది।
మిద్దెకుఁజని వేల్పుబత్తి । మించినుతించెన్॥ ౪౬.

ఉ॥ కారణకారణాఖిల జ । గత్పరిపాలక విశ్వరూప సం।
సార విదూరఘోరకలు । షఘ్న దయాంబుధి సర్వజీవనా।
ధారయశోవిహార విభు । ధస్తవనీయ చరిత్రభక్త మ।
న్దారన మోఽస్తుతేయనుచుఁ । దత్పురుఁడైయతఁడంతదిగ్గనన్॥ ౪౭

గీ॥ పలుకులెవ్వియు లేక భ్రమా । న్వడినవాని।
నార్తిమూర్తిఁభవించిన । యట్టులున్న।
దిస్పమొలవాని మిక్కిలి । డస్సియున్న।
చాటసారిని గన్గొని । పలికెనిట్లు॥ ౪౮.

మత్తకోకిల॥ ఔర యెవ్వఁడవీవు నివ్వెర । నందకెంతయుమిద్దనే।
తీరునజ్ఞాగఁగల్గినాఁడవు । దిగ్గునన్నముఁ జూచి క।
న్నీరువంచెద వేల నిన్నన । నెమ్మిప్పుట్టెను మాకు నీ।
యూరుపేరు విననగ్వేడుక । లూరుచున్నవి తెల్పుమా॥ ౪౯.

క॥ అని దువ్వాలువనొసఁగిన।
న్గాని మొలపై బిగియఁజుట్టు । కొనిలేచి యతం।
డనెనాయేలికతోఁ గ।
న్గానలందునవేడినీరు । గొబ్బునజాలన్॥ ౫౦.

మ॥ అనఘాయేమని తెల్పువాఁడనినుఁగ । న్నారన్నఁగన్గొన్నయం।
తనె దారాత్మజులున్నచోటు వెదుక । న్గాఁబోయెశోకంబు నె।
మ్మనమాశ న్గానసాగెనంగములకు । న్నాగన్ శ్రమంబుద్దవ।
య్యెనుసుస్వప్నమునిక్కమౌనటుల నెం । తేధన్యతన్బొందితిన్॥ ౫౧

క॥ మున్నీటి నావముప్పునఁ
జిన్నికొడుకుంతోడ ముద్దు । చెలియతోలంగ
న్గన్నీటఁ గొండదడుపుచు
నెన్నోయిక్కట్ల దాటియే । నిటులుంటిన్ ॥ ౫౨.

గీ॥ అనుచు నిట్టూర్పుల్ నిగుడింప । నతఁడు మిగుల
జాలిపడి బాటసారి కె । న్గేలుపట్టి
తండ్రినీవట నీవారు । తప్పిబ్రతికి
రేమొ సైరించు ముందు మే । లెనయవచ్చు॥ ౫౩.

క॥ తెలివిన్గాని కడచినయది
కలవలెఁదలఁపోసి హాయిఁ । గను మనిమఱపు
న్గొలిపించు వింతపూఁదే
నెలఁజొక్కన్జేసి యాత । నిన్దోడ్కొనుచున్॥ ౫౪.

గీ॥ కుడుచుమిద్దియకాదొర । గొబ్బునఁజని
చేడెలన్గూడి ముచ్చట । లాడుకొంచు
అదటునన్మించి పలుచవు । లారగించి
యాటపాటల వెన్నెల । బైటనుండ॥ ౫౫.

సీ॥ సన్నపుఁబెలుఁగుతోఁ । గిన్నెరజతఁజేసి ।
ఱేఁడుపొగడఁబాటఁ । బాడునొకతె
యదిగొఁ జందరుఁడు నా । కందె చూడుఁడియని ।
యేలికమోము ము । ద్దిడునొకతెన్
చెల్లరే వెన్నెల । చీరెగట్టితినని ।
తొడవులూడిచి నవ్వఁ, దొడఁగునొకతెన్
యింతలోనాకెవ్వ । రెనయని నున్నని ।
రతనంపు దిన్నెపైఁ । బ్రాఁకునొకతెన్
కోయిలల వెక్కిరించుచు । న్గూయునొకత
మొద్దిమో తలపోయుచు । నేడ్చునొకతి

యేమియెల్లరియని కనుఁ । బ్రాముసోకొంత।
సోలియాడెడు నొక్కతె । చొక్కునొకొంతె॥ ౫౬.

ఉ॥ చల్లనిరేయి తెమ్మెరలు । చక్కిలిగింతలువెట్ట వెన్నెల।
ల్చల్లఁగనవ్వ నెచ్చెలియ । చక్కనిమోము మగండునిండు జా।
బిల్లిగనెంచి సందియము । వీడఁగముద్దిడియందు నిక్కువం।
బెల్ల నెఱింగియున్గమి నా । కింత పరాకుననంటు మాటికిన్ ॥ ౫౭.

గీ॥ ఒడళు లెఱుఁగక వేడ్కల । నోలలాడు।
వారివలెఁదానుగూడఁ దా । ర్మారుపడుచు।
తలఁపులోనున్న చెలియ ద । వ్వులఁ జెలంగు।
పగిదిఁ బొరపాటుతోఁ దడఁ । బాటుచెంది॥ ౫౮.

శా॥ ఏమే యెట్లువచ్చినావు పసివాఁ । డెచ్చోటనున్నాఁడ హా।
స్వామీ ప్రాణము మళ్లిచేరినటుల । న్వచ్చెన్గదా చెల్వయా।
న్ప్రమోదంబునఁ గౌఁగలించుటకు డా । యన్దల్వితోనాసవం।
బీ మోసంబొనరించెఁగాని చెలియే । దీయన్పుసిగ్గొందినన్ ॥ ౫౯.

క॥ కని యండఱొక్క మొగిఁ బ।
క్కున నొండొరుఁగాంచి నవ్వ । కొనిరంతట మిం।
ట నణఁగసాగెన్జుక్కలు।
వెనువెంటన్జందమామ । వెలవెలఁబాఱెన్ ॥ ౬౦.

సీ॥ ఒంటిపాటునఁ బొక్కి । యురువయి కెంపెక్కి ।
విన్నతూర్పునఁదూఱె । వేగుఁజుక్క।
ఱెక్కలు జాడించి । ముక్కును,గోడించి ।
కొక్కొరొక్కోయని । కూసెఁగోడి।
నీటితావులఁదాటి । తోఁటల గడితేటి ।
యొడలు చల్లనసేయు । చుండెగాలి।
యైదుజాములపద్దు । గాఁదోఁచునిఁకఁబ్రొద్దు ।
పొడమెడునని చాట । దొడఁగెగంట।

పట్టులేడఁబాసి పిట్టలు ౹ బయటఁబాఱె౹
దలలు ఆక్కించి మొక్కలు ౹ చెలువుమీఱె౹
బలిమితోడుత నిద్దుర ౹ బరువుజాఱె౹
దెబ్బన న్వేసవిఱేయి ౹ తెల్లవాఱె॥ ౬౧.

గీ॥ అంతఁ దనయింతిఁ బాలకి ౹ యందున దార౹
చెలులు గొలువంగ నగరునఁ ౹ జేరఁబనిచి౹
యదివరకె పిల్వవచ్చిన ౹ యడవి వాండ్ర౹
నగపఱచి బాటసారితో ౹ ననియెనిట్లు॥ ౬౨.

శా॥ కంటేవేఁటకుఁ బిల్వవచ్చిరిపుడే ౹ గన్పోలువేరమ్మ వె౹
న్వెంట న్గుఱ్ఱమునెక్కి మంచొక ప ౹ ట్టాణిన్జూపి పేరఁజెంగే౹
ల్దంటన్బట్టులనేపిన్ మైమఱువుల ౹ న్దట్టంబుగావించి బ౹
ల్బంటుల్జాగిలముల్గడంగి యిరుక్రే ౹ వల్గాచియేతెంచఁగన్॥ ౬౩.

గీ॥ తానునొక్కవింత ౹ తరబడిగుఱ్ఱంబు౹
పైఁదుఱంగలించి ౹ బయలుదేఱి౹
గడియలోన నొక్క ౹ కాఱడవికిఁ జేరి౹
బాటసారితోడఁ ౹ బలికెనిట్లు॥ ౬౪.

మ॥ చెలికాఁడా యదె కొమ్మ పందిబుగద ౹ న్జిట్టాడియావైపు పే౹
రలు కన్గూపువలెన్గడంగెడు రవం ౹ త్రైనన్దిగుల్పొందక౹
వ్వాలచే యీఁటెయఁబట్టుమంచుఁ దనవా ౹ ర్వంబున్వడిన్గూఁటి యా౹
దల పైఁదాఁటఁగఁ జేసివెంబడిఁబెఱుం ౹ దన్బల్లెముగ్రుచ్చెన్॥ ౬౫

క॥ మెడత్రిప్పలేక బల్లెము౹
తొడలోని మురుకొనుచదియుఁ ౹ దునియలుచేయన్౹
వడిసీఁజెఁగ్రుచ్చి దాని౹
న్బడవైచెన్బాటసారి ౹ ప్రభువానగఁగన్॥ ౬౬.

ఆ॥ అంతలోనొకండ । హాపాదుసాకోలు।
పులియదిగోఁ గనుఁగొంటి । పోతునాడ।
గఱచివాకలోనఁ । బఱచుచున్నదియని।
విన్నవింపఁజేఁడు । వేడ్కమీఱ॥ ౧౭.

మ॥ బళిరా జేఁచులు జాగిలంబులు సికో । ల్పజ్జేసిపోనీకుఁడా।
పులినచ్చుజ్జెలికానితో మిగులఁ ద । న్నున్నొబ్బంది బాఁకుల్తుపా।
కులు చేఁబట్టి బిఱానఁబోయియచట । న్గొంకేమియున్లేక క।
న్నులనిప్పాల్గురియించు బెబ్బులియెద । ద్దూయన్గగుండేసిరన్॥ ౧౮.

క॥ వ్రేటువడియుఁ బొగచాటున।
మీటినటుల చాటసారి । మెయిదాఁటన్నే।
రీఁతెపులినోటనాటుచు।
మాటెనతఁడు తన్నుమేటి । మాటికిమెచ్చన్॥ ౧౯.

ఆ॥ ఇట్లు వేఁటనెఱపి । యేపారుబడిలిక।
లడఁపఁబొనకంబు । లానిగుఱ్ఱ।
ములను మాఁచిన యెక్కి । ప్రోలునకరుగుచు।
చాటసారికిట్లు । పలికెజేఁడు॥ ౨౦.

క॥ ఓయన్న యింతవాడవ।
నీయోర్పున్లావు తెంపు । నేర్పున్గంటిన్।
నీయడిగినదెల్ల నిడెద।
హాయిగనాయొద్దనుండు । మాయిఁకమీఁదన్॥ ౨౧.

క॥ ఎనిమిది యామడలు వెడలు।
పునుమఱియంతకిరురెట్లు । పొడవునసీనే।
స్తుని పట్టమెట్టులుండెనొ।
కనుమానల్కకడలఁగడలి । గాచుచునుండన్॥ ౨౨.

గీ॥ దొడ్డకొలనుండె నిక్కొండ । తూర్పునందు।
నదియు నీకంటఁబడవచ్చు । ననుకొనియెడ।
అందులోఁబుట్టి పట్నము । నంతఁజుట్టి।
మించియాపెద్ద యేఱుపం । డించుచుండు॥ ౨౩.

క॥ నిన్నమనమున్నమిద్దియ।
యెన్నండికొండఁ దొలిచి । యెవగొనరిచిరో।
యెన్నన్నాళ్లను మేమది।
యెన్నెన్నోతరములబడి । నేలుచునైనన్॥ ౨౪.

గీ॥ ఇంకఁబల్లంబుచేరితి । మిటకు నాలు।
గామడల మేర మనకోట । యలరుచుండు।
గడియలోఁగాల్వపైఁ బొంగ । పడవమీఁద।
నేగుదమురమ్ము వడిగఁ । బ్రొద్దెక్కకుండ॥ ౨౫.

ఆ॥ అనుచుఁదన్నుఁగూర్చి । తనపట్టముగుఱించి।
బాటసారితోడఁ । దేటపఱిచి।
యతనిఁదోడుకొనుచు । నాదొరయేగునా।
యేటికాల్వకుఁ గుడి । యెడమలందు॥ ౨౬.

లయగ్రాహి॥ నింగికిఁజెలంగి తుద । లంగలిసి పందిరి వ ।
లెంగడగినీడల నొ । సంగుబలుపోఁకల్।
సంగడినెసంగి నల । వంగముల కొమ్మలఁబె ।
నంగి కొనసాగు విడె । ముంగొలుప్రటాకుల్।
రంగుమెయిపండుగొల । లంగలిగినిచ్చెనలఁ ।
వంగినయనంటుల బె । డంగయిన మోకల్।
ముంగలఁ బొసంగఁజలు । వంగొనుచునంటు లెన ।
యంగఁ బరపోవలు తె । అంగులగుప్రమాకుల్॥ ౨౭.

చ॥ చెలువుగఁ గాచు వేర్పనస । చెన్నఁగి కొబ్బరిబొర్ల రేవుల।
న్వొలుపుగ మేటియుయ్యెలల । పోలికనూడలడ్డించి మించు మ।

ట్టులు దమయున్కిఁ జెప్పఁగ మ ǀ ఱుంగగువాడలునూళ్లుపల్లెలు।
న్వాలసలుచావడుల్మఱియుఁ ǀ బచ్చనిపైరులతోఁబొలంబులున్ ॥౨౮

ఆ॥ కనుచుఁబడవకాల్వ ǀ కట్టలలోఁదూఱి।
మబ్బులందుడాఁగి ǀ మఱలమఱలఁ।
దోఁచు ప్రొద్దుపగిది ǀ ఁదోడరఁగనివ్వాళి।
బట్టువారికెల్లఁ ǀ బసిఁడినిడుచు॥ ౨౯.

చ॥ చనిచని మన్నెకాఁడు తన ǀ సంగడికానినిజూచి నెయ్యుఁడా।
కనుమదె పెద్దయేఱడవి ǀ కైవడి నోడలుమిన్నుముట్టుచుం।
డ నెటుల నైదుకోసుల వె ǀ డల్పయి యొడ్డులుతీసిపాఱుచుం।
డెనో యెటులన్బిరంగులువ ǀ డిన్మనరాకకుమ్రోఁగుచుండెనో॥౩౦

ఆ॥ అనుచుఁ జెప్పుచుండు ǀ నంతలోఁబెనుచోఱ।
వలెఁ దమ పొగపడవ ǀ పట్నముదరి,
గొనఁగ నాల్గుజోళ్ల ǀ గుఱ్ఱములుపూన్చిన।
బండిమీద వారు ǀ బయలుదేఱి॥ ౩౧.

సీ॥ ఆమడచదరమై ǀ యంతటనేటి నీ ǀ
రుబికించు పెన్మర ǀ లొప్పుమీఱఁ।
బెద్దమేడలు కల్గి ǀ విరివియై దిద్దిన ǀ
యట్లుతిన్ననివాడ ǀ లందమూర।
మిన్ను గప్పుచుఁ బొగ ǀ మేటిమబ్బులవలెఁ ǀ
జెదరియంగళ్లపైఁ ǀ జెలఁగుచుండ।
సందువెట్టఁగనీక ǀ యందఱున్బజారు ǀ
కడపలరాకపో ǀ కలను సలుప।
బిచ్చగాండ్రును వెలయాండ్రు ǀ పేరునకయి।
నన్గలుగక వెలయుచుండు ǀ నగరునందుఁ।
దనరువింతలు పేర్వేరఁ ǀ దనసకునకుఁ।
జూపు చాద్గొరయేగెడు ǀ చొప్పునందు॥ ౩౨.

చ॥ తెరువునొకింతలేక చను ౹ దెంచెడు మూఁకఁదొలంగఁబుచ్చు బ౹
ల్తురికివటార్లయాపుఁజాలు త ౹ ళుక్కున నెండకుఁబొల్చు సన్నల౹
న్బరఁగు తుపాకులూనిన సి ౹ పాయిదళమ్ముల జోళ్లచప్పుడు౹
లొప్పరిఁబొరిబూరతాఱవళు ౹ లున్వొనుచక్రటిఁబిక్రటిల్లఁగ౯॥ ౧౩.

సీ॥ తడఁబడికొప్పులు ౹ సడలఁగఁబయ్యెద ౹
లెడలమేడలపయి ౹ కెక్కువారు౹
కనులారఁజూచి దీ ౹ వన పాటపాడి దో ౹
సిళ్లతోఁ బూవులు ౹ చల్లువారు౹
పట్నమునందలి ౹ పడఁతులకున్దండ్రి ౹
వలెఁ గోకలిడునంచు ౹ నలరువారు౹
తగవు నొక్కింతయు ౹ న్దప్పనొల్లఁడు నిజ ౹
ముగ వేలుపితఁడని ౹ మ్రొక్కువారు౹
నోము దొరసాని దేయని ౹ నొడవువారు౹
సొగసుఁగాంచి వితాకునఁ ౹ జొక్కువారు౹
నగుచుఁ జెలువలు గనుచుండ ౹ నాతఁడంత౹
లోన మెల్లనఁ దనకోట ౹ లోనికరిగె॥ ౧౪.

క॥ ఆకోటకునల్దట్లు౹
ప్రాకారమగడ్తయున్జా ౹ రన సాధ్యములా౹
ఆకోటలోని మేడలు౹
గైకొన్న సొగసులఁ బొగడ ౹ గనశక్యములా॥ ౧౫.

ఆ॥ అట్టి నగరిలోన ౹ నరుసువతెన్బాట౹
సారికొల్వఁబడుచు ౹ సంతసంబు౹
వడయఁజాలక దొర ౹ కడకొక్కనాఁడేగి౹
కనుల నీరువంచు ౹ చనియెనిట్లు॥ ౧౬.

మ॥ అకటా రోగికి విందొనచుఁనటులీ ౹ వందించు భాగ్యంబు రి౹
త్రకదాచెల్వానుబాసి మేటివలవం ౹ తన్గుందునీసంగడీ౹

నికిరాజోత్తమయాంతః బాష్పవృఁడవా । నీప్రాపుపోనాఁడి నే।
నీక నెందేఁగుదు నాలుబిడ్డల మఱే । నేతీరునన్నూఁ చెదరః॥ ౧౭.

సీ॥ తాను ముందుగలేచి । తానముగావించి ।
పొందమ్మివలె నాకు । మోముచూపు।
నిల్లు నీటుగఁజేసి । యెంతయున్గ్రాంజవు ।
లూరు వంటలు కడు । పారమేపు।
నేఁబైకిఁజని మళ్లి । యేతేర నాయఁడు ।
గులఁబట్టి నిమిరి బ । డలికఁబాపు।
నామాటకెన్నఁడ్రై । నన్జవదాఁటక ।
నానేరమెట్టిది । మైననోపు।
కలిమిలేముల నిల్లొక్క । కరణిజరుపు।
నన్నిటికినెక్కుఁడంచు । మర్యాద నెరపు।
కరము బీదలమ్మైఁగని । కరముపరపు।
నట్టి యిల్లాలిఁ బాసినే । నెట్టులుందు॥ ౧౮.

క॥ అని వగచు చాటసారి।
న్గనియెకిమీఁదూరడించి । కనికరమున ని।
ట్లనె నన్నయింక నడల।
న్బనిలేదొక మేలుమాట । పలికెదనిముగోన్॥ ౧౯.

గీ॥ పట్న ముజ్జెరునపుడె నీ । వారికొఱకు।
నరయఁబంపిన బంట్లిల్లఁ । దరిగివచ్చి।
చల్లగా నీవడఁతియు । న్బిల్లవాఁడు।
బ్రతికినారంచు నిప్పుడే । పలికిరిచుమి॥ ౨౦.

క॥ అనిచెప్పిన విని నందియ।
మును వేడ్కయు నబ్బరంబు । ముప్పిరిగొనఁగా।
మనసునఁ దడఁబడి యెద్దియు।
ననఁజాలక కొంత నిలిచి । యఁడిట్లనియెన్॥ ౨౧.

శా॥ నన్నున్ బెంచిన తండ్రి నాయొడయఁడా । నాపాలిమేల్వేల్పవా।
రున్నారా యెటులైననుం బ్రతికితా । మున్నారె యెందున్నవా।
రెన్నండిచ్చటికేఁగుదెంచెదరుబం । ట్లింకెట్టులన్జెప్పి నా।
రన్నానాకొకమాటలోనసెలవి । మ్మామ్మ యంతయుబ్రోమ్మక్కైదర॥ ౯౨

గీ॥ అనుచుఁ దత్తరపడుచుండు । నతనితోడ।
నరుసిటులఁ బల్కెవిను సంది । యంబువడకు।
మనమిటకు రాకమున్నె నీ । మగువవచ్చి।
యెద్దియోవ్రాసి చనినట్లు । లెఱుకపడియె॥ ౯౩.

క॥ అనిచెప్పి యమ్మగండా।
తనిఁ దోడ్కొని యోడరేవు । దాపున నింపాం।
దిన గంటకంబమునకు।
జ్జని యందలి వ్రాఁతనిట్లు । చదువఁదొడంగెన్॥ ౯౪.

చక్కెర॥ పెనుగాలి నోడమున్నిటఁ గొండపై । విడిచెడన్గ।
వెనుకొన్నయింకెదో నావయందఱు । న్బనిచితెచ్చె।
ననుఁగట్టుకొన్న యాతండొకండె క । న్పడకియుండె।
నినుగొల్తుఁ గంబమావానిఁ గాంచిన । న్వదకఁబంపు॥ ౯౫.

గీ॥ మేటి యిటుచదువఁగ విని । బాటసారి।
తాను నొకనూఱుమాఱుల । దానిఁజదివి।
ఆమెగుఱ్తులు చెప్పుఁడీ । యని యడిగినఁ।
గొండఱచ్చట నిట్లు పే । ర్కొనఁదొడఁగిరి॥ ౯౬.

చ॥ పిఱుఁదులమీఁటి యుంగరపుఁ । బేర్లవలెన్దఱు చొందిజాఱుమే।
న్నెఱసవరించఁ బోకమెయి । నిండఁగమాసిన చీరగట్టి పె।
న్వెఱపునఁ జూచు లేడికర । ణిన్నలుతెట్టులు గాంచుచూర్పుల।
న్నెఱపుచు బల్దిగుల్వడెడు । నీమెలపాయపుటింతి కన్పడెన్॥ ౯౭.

గీ॥ తెలిమొగలి పువ్వులేఁతరే । కుల తళతళ।
గలుగు చెక్కిళ్లనుండి వా । ల్కనులనీరు।
వలుదముత్తియములవలెఁ । బడుటనీదు।
చెలువ వలవంత కోకవింత । చెలువు దెచ్చె॥ ౯౮.

క॥ వినుమిటకుడా కడన్నదు।
నెనిమిది యామడలమేర । నెసఁగినపట్టం।
బున కిచటి సరకులన్గొనఁ।
జనుదెంచిన యోడనీదు । చానన్దెచ్చెఁ॥ ౯౯.

గీ॥ నెలపొడుపునాఁడు నీముద్దు । చెలువయిచట।
దాదియొక్కతె చిఱుతనో । దాచుచుండ।
వంటకంబులఁగొని యిది । వ్రాసిదీనిఁ।
గావుఁడనిమాకుఁ బెక్కురూ । కలిడి చనిరొ॥ ౧౦౦.

క॥ అనినమ్మకంబు పుట్టిం।
చినఁ గొండతెలుఁగునఁబొంగి । చెలియకనులఁ గ।
ట్టినమాడ్కిఁదోఁప నొకకొం।
తనిలిచి యాబాటసారి । తలపోసెనిటుల్॥ ౧౦౧.

ఆ॥ కట్టుకొన్నచెలిమి । కట్టులఁదప్పితి।
న్గట్టుకొన్నవాఁడ । నెట్టులైతి।
కట్టరాని మనసు కట్టి । బ్రతికితి ని।
న్గట్టు కొన్నవాఁడఁ । గనుకఁజెల్లె॥ ౧౦౨.

గీ॥ బోటి బ్రతికినదనినాకుఁ । దేటపడియెఁ।
గాని నాయున్కి నెఱుఁగ ద । చ్చానయకట।
పిట్టవలెనాకు ఱెక్కలు । వెలయునేనిఁ।
బడఁతిఁ గనకుందునే ఱెప్ప । పాటులోన॥ ౧౦౩.

చ॥ అనితలపోయుచున్నగచు । నాతనినేలిక బుజ్జగించి యి।
ట్లనెఁ జెలికాఁడనీదుచెలి । యన్ననుఁగొందువు సైఁచుమంచునాఁ।
డనినది నిక్కమయ్యెను గ । దాయిఁకఁగుందకు నిన్నునంపుదా।
పున నొకమేలుఁనీవలన । ఁబొందికగావలెరమ్మచెప్పెదన్॥ ౧౦౪.

గీ॥ ఇట్టులాయరు సాతని । నిట్టపట్టి।
కోటలోనికిఁ దోడ్కొని । కొంతతడవు।
వేడుకలఁబుచ్చి యవ్వాని । తోడ నొంటి।
నరిగియొకపూవుఁదోఁటలో । ననియెనిట్లు॥ ౧౦౫.

క॥ కనఁదగిన వింతశాస్త్రము।
తనంత జతపడినయప్డు । తత్వజ్ఞుఁడు పొం।
గునటుల నినుగన్నది మొద।
లనఘా నీహితుఁడులోన । నలరుచుమిన్నా॥ ౧౦౬.

గీ॥ అదిగోవచ్చెడుఁ జూడునా । యన్నకొడుకు।
చెలఁగి కోల్పులినాడించు । జెట్టిమిన్న।
తండ్రికెక్కుడుగానన్ను । దలఁచుచుండు।
నెల్ల చదువులునేర్చుఁ నీ । పిల్లవాఁడు॥ ౧౦౭.

సీ॥ మావంగడముపాడి । నేవినిపించెద ।
నన్నదమ్ములు పెద్ద । పిన్నవరుసఁ।
బరఁగియేల్బడిచేయ । వలయునుమాయన్న ।
యేలి పట్టంబునా । కిచ్చెనేను।
వీనికినొసఁగెద । వీఁడు నాకొడుకుల ।
కిచ్చుఁగాపుగడ యి । ట్లైసఁగవలయు।
నిరువదియైదేండ్ల । కేలికయై పెత్త ।
నంబంతదనుక నొ । నచఁదగును।
పిమ్మటన్నమూనాఁడు । విడిసియున్న।
కొండపై కేగి హాయిగా । నుండనొప్పు।

పెద్దలేపాటుచేసిన దిద్దుపాట్లు।
తెలిపెదన్వినుమా వేల్పు కొలువుఁగూర్చి॥ ౧౦౮.

మ॥ కలయందెత్తెడు మేనుఁద్రోఁచెడు జ గత్కార్యంబులున్నిత్తె స।
ఇచ్ఛల తన్వాస్తవమందు చందమున నీ సర్వప్రపంచంబు న।
జ్ఞులకునిక్కమ్ముగాఁ గనన్బడెడుఁ బ్రా జ్ఞుల్పూర్ణభావంబుని।
శ్చలమాటన్నమకన్న వేఱుగనరీ శత్వంబుఁ బ్రాపించుచున్॥ ౧౦౯.

ఆ॥ కౌఁచుముట్టుకొనరు కలనైన మావారు।
మేలెకానికీడు జోలిపోరు।
కల్ల పెద్దతప్పుగాఁదె గడన్బడుఁ।
పరువు నయముమాకు బ్రతుకుకన్న॥ ౧౧౦.

క॥ మామతమన్నన్గిట్టని।
మామయొకండుండె మేన మామ యితనికిన్।
నీమగువయున్న పట్నం।
బేమరఁ బోకేలునాతఁ డెక్కుడుదొరయై॥ ౧౧౧.

క॥ ఆతఁడు జగడంబిప్పుడు।
మాతోడన్నెట్టుకొనియె మనసుల మెరుసన్।
మా తెరువులు రెండు నెడం।
బైతిన్నఁగఁ గలియవద్దు పైనన్దప్పన్॥ ౧౧౨.

క॥ గుడియను పున్బడిదాణము।
పడంతి సుంకంబు నేలుబడిపట్లచోఁ।
మడిమైలలంచుఁ బిల్వ।
న్బడు సీరున్నిప్పులచటి వారలచేతన్॥ ౧౧౩.

గీ॥ అన్న వినులేకలేకయా యరుసునకొక।
కూఁతురొదవెను నామేన గోడలదియు।
వీఁడునొకచోటఁ దమచిన్న నాఁడు కలిసి।
యుంటనొండొరులఁ దవిలి యుండిరిపుడు॥ ౧౧౪.

క॥ అన్నిటనీడున్జోడు।
న్గన్నారి చిఱుతలకట । కట్టడిదయ్యెం।
బెన్నఁడు జతగూఁచెఁడునో।
యన్నా యారాచరికమె । యడ్డయ్యెఁగదా॥ ౧౧౫.

గీ॥ ఒంటిపాటునఁ గ్రుమ్మరు । చుండు మదపు।
టేన్గువలె నాఁకలిని దుర । లెఱుఁగఁడకట।
టకట యాసీమకొంటిగ । నరుగఁదలఁచి।
సైఁచకున్నాఁడు నాకేమి । తోఁచకుండె॥ ౧౧౬.

గీ॥ బలము సంగీత సాహిత్య । వైభవంబు।
చక్కఁదనము స్వతంత్రరా । జ్యంబు లేఁత।
పాయమలరారు వానిఁ ద । ప్ప మఱియెవనిఁ।
గట్టుకొననొల్లనంచు నా । కన్నె నిలిచె॥ ౧౧౭.

ఉ॥ ఇన్నియుఁగల్గినట్టి యొకఁ । డెందున నీతనికన్న లేమి నా।
కన్నియతానెఱింగినది । కావునఁ దండ్రికినట్లు చెప్పె నం।
తన్నలు దట్లరాజులక । తండది వెల్లడిచేయఁబంచెనో।
యన్నయిఁకైదునాళ్లుగడు । వైకనిపించెదుఁజుమ్ము పెండ్లికిన్॥ ౧౧౮.

గీ॥ అకట మాయన్న నితనినా । కప్పగించె।
నేను నీకొప్పగించితి । నీకొలంది।
యెఱిఁగియటుగాన మీరలి । ద్దఱు గడంగి।
తెరవలన్గూడి బిరబిర । న్దరలిరండు॥ ౧౧౯.

క॥ మీరే తెంచినతోడనె।
నారాజ్యంబన్నకొడుకు । నకు నిచ్చెద నా।
త్మారాములమై యడవి।
న్జేరి మనము పిదముక్తిఁ । జెందఁగ వలయున్॥ ౧౨౦.

ఆ॥ అనుచు బాటసారి | కానేలతోఁడన్న।
కొడుకు నప్పగించి | గడుసుబంట్లఁ।
దోడుచేసి యేటి | యోడరేవువఱకు।
నంపకంబుపెట్టి | యరిగెనంత॥ ౧౨౧.

క॥ కట్టెడలి కదలి మేల్కని।
బెట్టిదముగ నావులించి | పెన్బొగలెగయన్।
నట్టేటన్నడి పర్వెలు।
పెట్టెన్బెగోడమిగుల | వేడుకపుట్టన్॥ ౧౨౨.

గీ॥ అపుడు బాటసారి | యారాచపట్టితోఁ।
నోడచిత్తరువుల | తోడ వేడ్క।
నందలేనితనదు | డెందమున్దెలుపుచు।
ననఁగుఁదనముదనర | ననియెనిట్లు॥ ౧౨౩.

క॥ ఓడక పెంపుడు సింగఁపుఁ।
గోడెవలెన్వచ్చెదీవు | కొమరుఁడవకటా।
జోడయిన చేడియల విడ।
నాడి యునికి మనకు నొకటి | యై కన్పట్టెన్॥ ౧౨౪.

శా॥ అన్నా కన్నెతనంబునుండి తగుల్తై | యాముద్దరాలెంతయు।
నిన్నున్నన్గొనునంచు వింటిఁ దనకు | నీన్న వేడ్కన్దెల్పన్గనీ।
కెన్నండేయది యానవాలిడియె నీ | వీతీరు చేడ్పాటుతోఁ।
జెన్నున్దూలుటలేలనామిగులరా | సింగంబుపెంపందుటన్॥ ౧౨౫

గీ॥ మీఁదఁ గొండలొరగ | మేల్కనియున్నదు।
రించునట్టి మనసు | రెచ్చముద్దు।
గుమ్మయంపినట్టి | కమ్మఁజేకొని చవు।
లూరఁజదివె బాట | సారికిట్లు॥ ౧౨౬

క
వలపున్దెలుపఁగఁ జాలదు।
కలమ్ము మనచిన్ననాటి । కలసిమెలఁగుటల్।
తలపునకు వచ్చినయెడ।
న్నిలుచున్నాయనుజుఁదాఁచ । నేరన్నావా॥ ౧౨౭.

గీ॥ వావిమేనఱికము । పసితనంబుననుండి।
చనువుచేత యెంచు । కొనిన సొమ్ము।
దవ్వులయ్యెనిందు । జవ్వనపున్గోర్కె।
కఱవుదీఱనెపుడు । కనెదనిన్ను॥ ౧౨౮.

సీ॥ మనతగులమున నీమేన । మామకూర్మి।
పూను తెన్నునవేఁడుచు । క్కానిమలపి।
గడియలోపల నెడఁబాటు । కడలిదాఁటి।
రమ్మునీకల్మిబల్మి బిం । కమ్ములలర॥ ౧౨౯.

క॥ పలుమఱుఁదనపై నీచూ।
పులు వాఱఁగ నీదుడెంద । మున్గోని నీచే।
తులనంటి ముందుగాఁ బెం।
డిలి నీకీసవతి కమ్మ । నెఱపున్జుమ్మా॥ ౧౩౦.

సీ॥ చిలుక బూచులకులికి । జిలిబిలిగాఁబలికి ।
సాబాలుగాఁ దిన్న । చల్దిబువ్వ।
చిఱు జగడములాని । బిఱబిఱఁబొత్తాని ।
తనివితీరకయాడు । దాగురింత।
పట్టుపంతములాడి । బాగుగాఁగవఁగూడి ।
మెలపునఁబాడిన । మేలుకొల్పు।
అంటు జంటగఁగట్టి । దంటగానీర్వొట్టి ।
నిలుపు సంపఁగిగున్న । తొలిసమర్త।
ఆనవాళ్లవినన్నఁగ । న్నారఁజూప।
నేగుదెంచిన యీగాలి । ప్రోగుబొమ్మ।

మనసువచ్చినయట్లు ని । న్నరులఁ గొల్వఁ।
భోగలుచున్నది నిక్కంపు । బొందియిచట॥ ౧౩౧.

క॥ అని వగమీఱఁజదివి దా।
పునఁగల యచ్చెలువయంద । మున్దనకన్దో।
యనలేదు కొంచూర్పుల నిడు।
చు నతడు చెలివాలుకనులఁ । జూచి యిటులనున్॥ ౧౩౨.

గీ॥ మొదట వాపులెఱింగిన । ముద్దుచూపుఁ।
బిదపఁ గురులుంచుదాపున । బెదరుచూపు।
దగిలిమెడఁబాయఁజాలని । దిగులుచూపుఁ।
గనులదాబూచి చూపు నా । కన్నెచూపు॥ ౧౩౩.

చ॥ అని దిగులందు నాతనికి । నంతటనూచఱచు బాటసారి యి।
ట్లనఁ జెలికాఁడ యచ్చెలువ । నంటకయేయిటు వేగుచుంటి వే।
మనిమొద నెల్ల వేడుకల । నందఁగఁజేసిన దానిఁబాసి పో।
క్కనను దలంచియైననిఁకఁ । గుందకుచూడుము రేయిమించెడిన్॥

సీ॥ ఆకసంబున నడు । గంటిచుక్కలు అవ ।
లట్లు చీఁకటినీట । నలరుచుండెఁ।
గరఁగిన వెండి నీ । ర్పరపిన తీరున ।
నలలవాలుగమీలు । తలుకుమీఱె।
మీఁదుక్రిందులఁబొల్చు । మింటినట్టనడుమ ।
గావడియద్దమై । కడలితోఁచె।
దొప్పచేతులవలెఁ । దూఁగాడు కరడము ।
ల్గొప్పచందువల జో । కొట్టుచుండె।
చుక్కజాడలఁ బొగమోడ । చొక్కుచుండె।
గాడు పెల్లైడలజ్జోల । పాడుచుండె।
నిగిడిగడియారమిదిగోఁ బ । న్నెండువేసె।
నిఁకఁ జెలిమికాఁడమనము పం । డు కొనవలయు॥ ౧౩౪.

క॥ అని రాకొమరున్నిదురకుఁ।
జొనిపి తనకుఁ గన్నుమూఁత | చొప్పడకుల్లం।
బున నగపడు తనచెలియకు।
ననఁగఁదొడఁగె బాటసారి | యడలుచు నిటులన్॥ ౧౩౬.

మ॥ తరుణీకన్గవఁబోలి తెల్వియెడ ని | ద్రన్జొక్కనప్డంటిపా।
టరయన్బోవని నిన్ననన్నెడపెనే | యకట్కాళదయ్యంబు కా।
నిరవంత్తైనఁ దొలంగకుండునుగదా | నీమూపు నాలోన న।
ద్దిరనాకిద్దియెచాలుఁ జూచుకొనెద | న్దెల్లంబుగానెప్పుడున్॥ ౧౩౭.

క॥ నిడువాలు కనులు తీయని।
నుడువులు ముంగురులుచెదరు | నుదురున్మెల్పు।
త్తడిమేను సన్ననడుము పొ।
గడఁ దగు నీపడకకనులఁ | గట్టున్జుమ్మా॥ ౧౩౮.

సీ॥ అడుగులుగంద నె | న్నడుమువడఁక నీవు |
తిరిగిచూడక నీళ్లు | తెచ్చుపాయలు।
చెక్కిళ్లకిఁగడల్చువురు | చేతులఁజేర్చి |
యెప్పుగానీవు పొ | య్యూదుతీరు।
దాకెలు వెన్నమీఁ | దనొమ్మి నెమ్మను |
వంచుచు నీవు వ | డ్డించు చెల్వు।
కొనగోళ్ల నీనియల్లును | ముచుమడుపుల |
మచ్చికతోడ నీ | విచ్చుపాగసు।
నన్నుఁగనినప్పుడెల్ల నీ | కున్న జోక।
నేను జబ్బుగనున్నప్డు | నీయలజడి।
నాదుచుట్టములందు నీ | నమ్మకంబు।
నెందనుకఁదలపోయుదు | నెట్టులొర్తు॥ ౧౩౯.

క॥ ఇది యేమి సోద్దెమోకద।
ముదితా నిన్దలఁచి నేను | పొందుకలవరం।

బెదకింపైతోఁచుచు ను।
న్నది యిటఁదక్కినతలంపు లన్నిఁటికన్నన్ ॥ ౧౪౦.

ఉ॥ ఎన్నఁడు నిన్నుఁగన్దుఁ జెవి కింపుగనీ నెరముద్దుమాటలిం।
కెన్నఁడు విన్దునక్కట చె లీ యిపుడెక్కడనున్నదానవో।
నాన్నయటంచు బిడ్డఁడను నప్పుడు నీయెద యెట్లులుండున।
న్నన్నతొలంగుచున్నయును ఆసయెపోవఁగనీకనిల్పెసన్ ॥

గీ॥ అనుచుఁ బెక్కుతెఱంగుల నతఁడుపొగలి।
నెగడునిద్దురఁగడకంటి నీటఁదుడిచి।
అనుఁగుఁ జెలికానిఁ దెలవాఱె నంతఁదెల్పి।
ముచ్చటించెనిటుల వగ పున్మగించి॥ ౧౪౨.

శా॥ అన్నా హాయిగఁగూర్చువట్టినదియే యాఁజూడుమా యోడకు।
న్మన్నీర్వాయలువిచ్చియత్తుకొనకెం తోలోఁతుగాఁదోఁచునె।
న్నెనోన్నకోసులమేరనద్దిర యిదే మీకొండలుజ్నెట్టలుఁ।
న్నిన్నున్నన్మన్నినివెల్ల వెన్వెనుకకు న్వేపర్వ్యాలన్బెట్టెడున్ ॥౧౪౩.

చ॥ అదె మనమేగుపట్నమెటు లబ్బురమై పొడకట్టుచుండెఁ బ।
న్నిద మొనరించు గుజ్జమటు నిల్చినయోడపయిన్నిడంబు లొ।
ప్పిదముగ సన్నలన్దెలుప వేగిరపాటున మిట్టుపల్లము।
ల్గదియుచుఁజూడు తెప్పలల లంబడియిచ్చటికేగుదెంచెడిన్ ॥౧౪౪

గీ॥ అన్చు వారలిరువురు వా కొన్చుమిగుల।
నాసయువ్విళులూర సం తోసమలర।
ఓడడిగిపడవలఁజొచ్చి యొక్కగడియ।
కొడ్డునకుఁజేరి హాయిగ నున్నయంత॥ ౧౪౫.

ఆ॥ వారు తమకు నెదురు వచ్చిన యారాచ।
కన్నెచెలులఁగాంచి కలతెఱంగు।
వినఁగ వేడ్కపడఁగ వివరించిరవ్వారు।
కేలుదోయి నొసటఁ గీలుకొలిపి॥ ౧౪౬.

క॥ మమ్మేలు రాచకన్నియ।
మిమ్ముఁదనపూవుఁదోఁట మేడఁగలయఁగా।
నిమ్మొనరిచి తత్తరమున।
రమ్మని యిదెకెంపుటుంగ రము గుఱుతిచ్చెన్॥ ౧౪౭.

క॥ అని చెలులిచ్చిన యుంగర।
మును గన్గవనద్దుకొనుచు ముద్దిడుకొన్చు।
క్కునఁ గదియించుచుఁ దనచిటి।
కెన వ్రేలనమర్చి దాని కిఁబలికె నతఁడున్॥ ౧౪౮.

గీ॥ నీపసిండిచెలియ నెమ్మేనిజిగిదెల్పు।
నీదుకెంపుమోవి నిగ్గుదెలుపుఁ।
గాని చెలువమనను గనిపెట్టి చెప్పక।
యుంటివేమొ ముద్దు టుంగరంబ॥ ౧౪౯.

క॥ చెలియేమి చేయుచున్నది।
పలుమఱు నిడువాలుకనులఁ బరపుచునీతోఁ।
బలికిన పలుకులుకలవా।
తెలుపుమనఁగఁ జెంతనున్న తెఱవలలరుచున్॥ ౧౫౦.

చ॥ తెలిపిరెఱేఁడనీవు చను దెంచుటకున్వ్రాలనెంచిచూపమా।
వెలదుక పెంపకంబు పసి పిల్లనిముంగలఁగాయపండుల।
న్నిలుపుచు నీదురాకవిని నివ్వెరతో నొకకొంతసమ్మక।
వ్వాలనగపచ్చవేడ్కను పండుగచేసెనుమాకదెంతయున్॥ ౧౫౧

చ॥ కలకలనవ్వువేలుపుల కైకయిమోడ్చుచుఁ బైటదిద్దుకొం।
చలపట చూపుముంగురుల నద్దములోసవరించు దిట్టచూ।
డ్కులఁబచరించు మమ్ముఁగనుఁ గొంకుసిగ్గలరించు నెత్తల।
న్బలుమఱునూఁచుమాచెలువ పట్టఁగఁజాలని వేడ్కమీఱుటన్॥

క॥ అని చెలులు సెప్పితోఁడ్కొనఁ।
దనివిన్గొని రాచపట్టి తనకైయేపఁ।

చిక్కన క్రొంబూఁదోఁట విడిది।
కనుఁగుంజెలికానితోడ । నరిగెబిత్తానఁ॥ ౧౫౩

ఆ॥ అపుడు బాటసారి । యారాచపట్టికి।
జరుగువేడ్కఁ జూచి । సంతసించి।
యును మఱి తనచెలియ । యున్న చోప్పెటుగాంతు।
ననుచు నెమ్మదినను । కొనియెనిట్లు॥ ౧౫౪

సీ॥ కొన్నాళులడియాసఁ । గొనుచుండు డెందము ।
చెవ్వుచేఁతలకెల్ల । నొప్పియొప్పి।
తలఁచని యిమ్ములు । తమయంతఁ జేకూరు ।
నప్పుడు రానీక । త్రొప్పిరొప్పి।
కొన్నాళ్లు పొట్టకు । కూఁకట్టికై యందందఁ ।
దెన్నుమాలిన బొందిఁ । ద్రిప్పిత్రిప్పి।
యర్మిలిగనకుఁడో । యయ్యలారాయని ।
గొప్పనావలవంతఁ । జెప్పిచెప్పి।
అదియటులఁ గాని యెడనేమి । యాఁదునేను।
మరియు బ్రతుకుటయో మెండి । మొరవవలెను।
కాదుమనియెద నింక నీ । మీఁదనేమి।
యగును నావని నానాట । నరుగుటకద॥ ౧౫౫

గీ॥ జగముతో జోలినాకుఁ గ । లుగుటవలన।
నామనసు దిట్టపడఁగ నిం । తవఱ్ఱకైన।
నిల్వఁజాలితిఁగాని న । న్విడిచి యన్న।
మెఱుఁగని చెలినాయెడఁ బాటు । నెట్లుసైఁచు॥ ౧౫౬

గీ॥ పిల్లవాని నెవర్కైనఁ । బెంచనిచ్చి।
యకట ననుజూడఁగలైదు । నాసదొఱఁగి।
నాగరికత నామనుగడవు । నాదిపాడు।
బలిమిచేతను సుఖులెడఁ । బాసెనేమొ॥ ౧౫౭

క॥ కౌని యెడన్నగవాలక।
మూని మగువలోనమిగుల । నుడుకుచునే నెం।
దైన నగపడుదునోయని।
తానూళ్లన్నబల్లెలందుఁ । దలడిలునేమో॥ ౧౫౮.

గీ॥ తలిరుటడుగులలో ముండ్లు । దగిలెనేమొ।
పసిఁడిమేనెండ తాఁకునఁ । బడలెనేమొ।
పట్టుమెత్తనికురులట్టు । గట్టెనేమొ।
నాకనుల పండువింకఁగా । నఁ బడదేమొ॥ ౧౫౯.

సీ॥ నిను తెప్పపాటైనఁ । గనుకున్న నోర్వని ।
కన్నులు కాయలు । కాయవలసె।
నీమాటలన్గసిం । తే విననేరని ।
ములుచచెవులు చెట్లు । మొలువవలసె।
నీదుపేర్చవిగొంట । నిముసమేనియుమాన ।
నట్టి నాలుక గడ్డి । కట్టవలసె।
గడియసేపయిన ని । న్నెడసి నీరగుచుండు ।
గుండెబల్బండరై । యుండవలసె।
కటకటా నాదు మేల్మి బం । గారుబొమ్మ।
నాబ్రతుకు పట్టమెచటను । న్నావొ వాలు।
కన్నుఁగవ నీరు వరదలు । కాచుఁ జెట్లు।
కుందుచున్నావొ యిప్పుడు । నన్నుందలంచి॥ ౧౬౦.

ఆ॥ విన్నఁబోయి యిట్లు వెత । చెందు నాబాట।
సారి మోముఁగాంచి । జాలిమించి।
అపుడు రాచకోమరుఁ । డచ్చెలికానికిఁ।
దలఁపుమఱలునట్లు । పలికెనిట్లు॥ ౧౬౧.

ఆ॥ అయ్యయింకమీద । హాయిమనకుఁగల్గు।
నంచు గుఱుతుచెప్ప । నాకసంబు।

వేఁడిగాడ్పు వేస | విన్నాపి చల్లని।
మబ్బుఁగ్రమ్ముచున్న | మాడ్కిఁగంటె॥ ౧౬౨

సీ॥ తొలితెల్ల కొండల | వలెనున్న మొగుళులు |
గొప్పలైనీలిరం | గులఁదనర్చె।
దూదిపింజెలలాగు | దొడ్డమబ్బులనేకి |
కరువలిపఱపులు | గా నొనర్చె।
వెండిచబుకుఁ ద్రిప్పి | వేసిన యట్టులు |
మెఱుముతోడఁత బెద్ద | యుఱుముపుట్టె।
నేలఁగమ్మనితావి | నెగడించు చందంద |
వలునలై లెక్కచి | న్కులు మొదలిడె।
మింటికిన్మంటికిఁ దఱచు | మీఱువాన।
ధారలను తీఁగెలబిగించి | యూఱువవడి।
వీణెవాయించు నెఱజాణ | గాణమాడ్కి।
నందములగుప్పి గాలి పా | డందొడంగె॥ ౧౬౩.

గీ॥ వంగియక్కున నొకచిఱు | తంగదించి।
చూడు వచ్చెడు నెవతో యీ | మేడదరికి।
జడిసి పిల్లకు ఱెక్కలు | చాటుచేసి।
పట్టునకుఁ బర్విడెడు కోడి | పెట్టవలెను॥ ౧౬౪.

క॥ అనుచున్దన మదిఁద్రిప్పఁగ।
గనుఁగవ నగపడఁగనీక | క్రమ్మిననీటన్।
మునికొంగునఁ దుడుచుకొనుచుఁ।
గనుఁగొని యాబాటసారి | కడుసంభ్రమునన్॥ ౧౬౫.

గీ॥ లేచినిలిచినిదానించి | చూచి కేలు।
దోయి తట్టుచు నెగురుచు | దొడ్డనోట।
నదిగొ నాదాది నాయయ్య | యిదిగొఁగంటి।
ననుచు నెదురేగెనేస్తున | కబ్బురముగ॥ ౧౬౬.

క॥ అప్పుడు దాదియు నాతని।
జప్పునఁ బరికించి పోల్చి । సరగననియె మా।
యప్పా నీబిడ్డండిదె।
యొప్పుగ నీయాలునిచట । నున్నదిసుమ్మీ॥ ౧౬౭.

ఆ॥ ఇచటి రాచకూఁతు । రెంతయుఁ గూర్మితో।
మమ్ముఁ బెంచుచుండె । మామొఱవిని।
వెదకివెదకి విసికి । సొదఁజొత్తునంచు నీ।
పడఁతినేడుగట్టి । పట్టుఁబట్టె॥ ౧౬౮.

ఆ॥ పాలు పొంగుచూపి । పైమూఁతలు బికించి।
పడెడు పోల్కి-డెంద । ముడికి నిదుర।
నైన నుబ్బికనుల । యందు నీరై పొర్లుఁ।
జెలియవంతయెంత । చెప్పుదాన॥ ౧౬౯.

గీ॥ ఇచట బుడుతనికిన్నిల్లి । యిడుచునేను।
దిరుగఁజప్పునఁ బెన్వాన । గురియఁజొచ్చె।
అంత బిఱబిఱ నీమేడ । చెంతఁజేరఁ।
గంటఁబడినావు మానోము । పంటవలెను॥ ౧౭౦॥

క॥ అని చెప్పినఁ ద త్తఱపా।
టు నెమ్మియబ్బరమతఁడు క । డున్గసితనమే।
ల్వినిపించు మనుచు నద్దా।
ది నాలికడకంపి చేరఁ । దీసికొడుకనిన్॥ ౧౭౧.

ఉ॥ అక్కునఁజేర్చుణ ముద్దడున । హాయని ముచ్చటలూరఁజిన్నినా।
చక్కనితండ్రినిన్నెడయఁ । జాలితినేయని కంటనీరిడు।
న్జక్కెరవెట్టు మచ్చికనొ । నచూఁ గురుల్మెడుచున్నగించున।
మ్మక్కనిపించు విద్దియము । లాడఁగఁజేసెడు మాటిమాటికిన్॥

ఆ॥ ఛాటసారియంతఁ । బట్టఁజాలని వేడ్కఁ।
జెలఁగి సంగడీని । చేతికిఁదన।

యనుఁగుఁగొడుకునిచ్చి । యడఁకువ పెంపార।
నొసటఁగేలుమోడ్చి । నుడివెనిట్లు॥ ౧౭౩

గీ॥ మిగుల నట్టేట గ్రుక్కలు । మ్రింగుకొనుచు।
నట్టె కొట్టుకొనెడుపట్ల । పట్టునిలుపు।
నడుగునీయయ్యగానొడ్డు । నందుఁజేర్చుఁ।
నోడగానీవు నన్నుఁగా । పాడినారు॥ ౧౭౪

ఉ॥ ఇంచుకవాండ్రమైనఁ దమ । కెక్కుడుగాఁగనుచుంద్రుకొర్కెకా
సించక కొల్చుకొండ్రిడుమ । చేసిన వారలకేని మాఱుచె।
ల్లించరు కల్లలెన్నఁడు గ । డించరు మిక్కిలికూర్మియల్లెడం।
బెంచుదురేల్న వారలిఁక । మిమ్ముఁదలంచినఁ గీడులంటునే॥ ౧౭౫

ఆ॥ మునుపు నీటిలోన । మున్గి యూపిరియాడ।
కున్న మాడ్కినిడుమ । లొందుచుంటి।
ఇపుడు పైకిఁదేలి । న పగిది మీప్రాపు।
వలన మించిమంచి । బ్రతుకుగంటి॥ ౧౭౬

ఆ॥ అనుచుఁ బల్కఁగవిని । యారాచకొడుకనె।
సంగడీఁడయింత । సంతసంబు।
మనకు సమకుఱుటకు । మాయయ్యకతమత।
డౌరమాఱువేలు । పనఁగవచ్చు॥ ౧౭౭

గీ॥ అయ్య నీయాలుకాఁబోలు । నడిగొవచ్చు।
చుండె నిరుదట్లఁ జెలువల । నొప్పమీఱి।
మీఁదియంతరువందునే । మెలఁగుచుండు।
మించిమీఱిచ్చటున్మచ్చ । టించుకొనుఁడు॥ ౧౭౮

క॥ అనిరాచపట్టి చనెనె।
ల్గును వెన్కనుచందమామ । కొమరునదాది।
న్మనుకొని తనయిల్లాల్రాఁ।
గనుఁగొని యాబాటసారి । కనుపండువుగాఁ॥ ౧౭౯

గీ॥ పిదపనయ్యాలు మగలు పె । న్వేడ్క నొండొ।
రువుల కౌఁగిళ్లలో బల్ది । డవుగఁ జొక్కి।
నంతఁ బెనిమిటితోడ నా । యతివపలికె।
జాలినునుసిగ్గు । కన్నవమేళగింప॥ ౧౮౦.

క॥ నీకౌఁగిటఁబడు నాదట।
చేకూరుననుకొనలేదు । చీఁకటిగానిం।
దాక నగపట్టెనంతయు।
నాఁకలి నిద్దురలు దవ్వ । లయ్యెన్సుమ్మా॥ ౧౮౧.

గీ॥ ఆసయున్నందియము డెంద । మందుఁబెనయ।
నెంతయోయోచించి తుదకిసు । మంతయైన।
ముందు తెరుకువయగపట్ట । మిందెగించి।
చిచ్చు చొరఁబాఱనుంటి ని । క్కచ్చితోడ॥ ౧౮౨.

గీ॥ అనుచుఁబల్కెడు మగువన । క్కునగదించి।
కురులుదువ్వుచు ముద్దులు । గొనుచు బాట।
సారియనె వేల్పు నెమ్మనో । చానమనకుఁ।
దెరలె నిక్కట్టులెల్ల నా । తెరవువినుము॥ ౧౮౩.

సీ॥ అపుడట్లు మున్నీటి । యందుఁబెన్గాలికిఁ ।
దలఁడిల్లు నోడచా । పలను డించఁ।
జనిమెట్ట తాకునఁ । జప్పునఁ ద్రుళ్లిపైఁ ।
బడితి నేమనిచెప్ప । వాఁడఁబిదప।
మున్గితేలుచు నదే । మూలకోకొట్టఁగఁ ।
బడియొకంతటఁ దెల్వి । వడసియొడ్డు।
చేరితిననిపోల్చి । చేతులున్నాళ్లు మె ।
ల్లనఁగూర్చుండికొని లేచి । నినుదలంచి।
యేలబ్రతికితినని యేడ్చి । యేడ్చిసూది।
కొండమీఁదుగ నొకతేని । దండకరిగి।

వానినగరున నీదుచే ǀ వ్రాలుచదివి।
మంచినోమున నిన్ను గ్ర ǀ మ్మఱఁగలసితి॥ ౧౮౪.

క॥ పడఁతీ వెనుకటివంతల।
కడలవలదు మనకు హాయి ǀ నందించిన రా।
కొడుకదె నడ తెంచెడు సం।
దడితో నేనచటికేగ ǀ దనని పలుకుచున్॥ ౧౮౫.

చ॥ వడివడినేగియిల్లనియె ǀ బాపురెయేలిక వేడ్క లెవ్వియో।
పొడమినయట్లు తోఁచెననఁ ǀ బొంగుచురాకొమరుండు సెప్పెని।
క్కడి మనయక్క అల్వొసఁగెఁ ǀ గాంచితిమామనతండు నాకొడం।
బడి తనకూఁతునిచ్చుటకు ǀ మాటనొసంగెనుజుమ్మి నెయ్యుఁడా॥

ఆ॥ నన్నుఁబోలువాని ǀ నామామ వెదకియుఁ।
గాంచలేకయిట్టు ǀ కట్టువడియె।
వేఱునడతలగుటఁ ǀ బెండ్లిమానగరున।
సలుపుకొనఁగ సెలవొ ǀ సంగినాఁడు॥ ౧౮౬.

ఆ॥ అనుచునతఁడు పల్కి ǀ సంతఁజెలులుచుట్టుఁ।
గొల్చుచుండఁ బెండ్లి ǀ కూఁతురరుగు।
దెంచెహాయలుమీఱ ǀ దివ్వెలయందునఁ।
దనరుమేటి తెలిమ ǀ తాబువలెను॥ ౧౮౭.

క॥ అప్పుడడుగులు స్దడఁబడ।
గుప్పునఁ బూఁదావులీను ǀ కొప్పుసడల సి।
గ్గొప్పఁ బసినాటి చనవున।
నప్పడఁతుక మగనికేలి ǀ నంది బిఱాన్॥ ౧౮౯.

గీ॥ ముత్తైపుఁ జిఱునగవు మొల ǀ కెత్తుచుండఁ।
జీఁకటి మెఱుపువాల్చూపు ǀ చిమ్ముచుండ।
కుల్కుతల్కులఁ బయ్యెద ǀ కొంగుసరదు।
కొంచుబావాయనుచుఁ బల్క ǀ రించునంత॥ ౧౯౦.

నట్టువు॥ పొంగుచు మేనుగగుర్పొడువద్దమి । పొదలఁగఁ బువువిలుతుని
వలెరా।
సింగము మైమఱపుంగొని చెంగటి । చెలుఁగనుఁగొనకకవుఁగిలిలో
నంగదియించి తనుంగడుముద్దిడ । నగిచెలి పెనఁగిమఱలునటు క।
న్నుంగవతార్పులఁబయ్యెద జాఱ్పల । నుఁబలుమఱునెఱపెఁ జెలు
వముగాన్॥ ౧౯౧.

గీ॥ ఇట్లు బలుపుమున్నిటిలో । నీఁదులాడు।
వారిఁదోఁచ్కొని యాబాట । సారి కడలి।
దాఁటి కొన్నాళ్లకున్దన । మేటిసంగ।
డీని నప్పెంక్షిగొడుకు తం । డ్రినిగనియనె॥ ౧౯౨.

క॥ జేఁడా కను నీకొడుకు।
న్నోడలినిన్వీరె నాదు । కోమలిబుఁకుతల్।
నేఁడు మొదల్నీ వారము।
వేడుకతో మమ్మునింకఁ । బెంచఁగవలయున్॥ ౧౯౩.

ఆ॥ అనఁగ జేఁడు వలికె । నాబాటసారితో।
మీరు మేముకలసి । మెలసి హాయి।
చెలఁగ మనుదమింకఁ । గలకాలమొక్కటి।
యగుచుఁ బాలనేయి । యలరుమాడ్కి॥ ౧౯౪.

చ॥ అనవిని బాటసారి కడు । హాయిగనంతటనుండి కోరిన।
ట్లనయముఁ దన్వివిమీర జగ । మంతయునొక్కటఁదానెయైనతీ।
రున నెదు రెందునన్గనక । క్రొత్తతనర్పుల నిచ్చలందుచు।
న్మనుగడ రేపుమాపులొక । మచ్చుగనెల్లెడ మెప్పుపొందెడున్॥ ౧౯౫.

